# అథ షోడశో%ధ్యాయః

## దేవీ శక్తి ఉద్భవించుట

వాయురువాచ |

అథ దేవో మహాదేవో మహాజలదనాదయా | వాచా
మధురగంభీరవిశదశ్లక్ ష్ణవర్ణయా || 1

అర్థసంపన్నపదయా రాజలక్షణయుక్తయా |
అశేషవిషయారంభరక్షావిమలదక్షయా || 2

మనోహరతరోదారమధురస్మితపూర్వయా | సంబభాషే సుసంప్రీతో
విశ్వకర్మాణమీశ్వరః || 3

వాయువు ఇట్లు పలికెను -

అప్పుడు ప్రకాశస్వరూపుడు, దేవాధిదేవుడు, మిక్కిలి ప్రీతిని పొందినవాడు అగు ఈశ్వరుడు గొప్ప మేఘగర్జనను పోలియున్నది, మధురము గంభీరము సుస్పష్టము మరియు సున్నితము అగు వర్ణములు గలది, అర్థముతో నిండియున్న పదములు గలది, రాజఠీవి గలది, సకలములైన విషయములను ఆరంభించి వాటిని స్వచ్ఛముగా పోషించుటలో సమర్థమైనది, మిక్కిలి మనోహరము ఉదారము మధురము అగు చిరున వ్వుతో మొదలగునది అగు వాక్కుతో సృష్టికర్తయగు బ్రహ్మను ఉద్దేశించి ఇట్లు పలికెను (1-3).

ఈశ్వర ఉవాచ |

వత్స వత్స మహాభాగ మమ పుత్ర పితామహ | జ్ఞాతమేవ మయా
సర్వం తవ వాక్యస్య గౌరవమ్ || 4

ప్రజానామేవ వృద్ధ్యర్థం తపస్తప్తం త్వయా%ధునా | తపసా%నేన
తుష్టో%స్మి దదామి చ తవేప్సితమ్ || 5

ఇత్యుక్త్వా పరమోదారం స్వభావమధురం వచః | ససర్జ వపుషో భాగాద్దేవీం దేవవరో హరః || 6

యమాహుర్బ్రహ్మవిద్వాంసో దేవీం దివ్యగుణాన్వితామ్ | పరస్య పరమాం శక్తిం భవస్య పరమాత్మనః || 7

యస్యాం న ఖలు విద్యంతే జన్మమృత్యుజరాదయః | యా భవానీ భవస్యాంగాత్సమావిరభవత్కిల || 8

యస్యా వాచో నివర్తంతే మనసా చేంద్రియైస్సహ | సా భర్తుర్వపుషో భాగాజ్జాతేవ సమదృశ్యత || 9

యా సా జగదిదం కృత్స్నం మహిమ్నా వ్యాప్య తిష్ఠతి | శరీరిణీవ సా దేవీ విచిత్రం సమలక్ష్యత|| 10

సర్వం జగదిదం చైషా సంమోహయతి మాయయా | ఈశ్వరాత్సైవ జాతా%భూదజాతా పరమార్థతః || 11

న యస్యాః పరమో భావస్సురాణామపి గోచరః | విశ్వా%మరేశ్వరీ చైవ విభక్తా భర్తురంగతః || 12

తాం దృష్ట్వా పరమేశానీం సర్వలోకమహేశ్వరీమ్ | సర్వజ్ఞాం సర్వగాం సూక్ష్మాం సదసద్వ్యక్తివర్జితామ్ || 13

పరమాం నిఖిలం భాసా భాసయంతీమిదం జగత్ | ప్రణిపత్య మహాదేవీం ప్రార్థయామాస వై విరాట్ || 14

ఈశ్వరుడిట్లు పలికెను -

ఓ కుమారా! కుమారా! నీవు నా పుత్రుడవు. ఓ పితామహా! నీ వాక్యములోని గాంభీర్యము అంతయు నాకు ఎరుకయే (4). నీవు ఇప్పుడు ప్రజల వృద్ధి కొరకు మాత్రమే తపస్సును చేసితివి. నీ తపస్సుచే నేను ప్రసన్నుడనైతిని. నీ కోరికను తీర్చెదను (5). ఈ విధముగా మిక్కిలి ఉదారమైనది, స్వభావము చేతనే మధురమైనది

అగు వచనమును పలికి, దేవదేవుడగు శివుడు తన శరీరభాగమునుండి దేవిని సృష్టించెను (6). సర్వేశ్వరుడగు శివపరమాత్మయొక్క ఆ దివ్యగుణములతో కూడియున్న సర్వోత్కృష్టశక్తిని బ్రహ్మవేత్తలు దేవి అని వర్ణించుచున్నారు (7). ఆమెయందు పుట్టుక, మరణము, వృద్ధాప్యము మొదలగునవి లేవు. ఆమె భవుని శరీరమునుండి ఆవిర్భవించుటచే భవాని యనబడును (8). వాక్కులు, మనస్సు మరియు ఇంద్రియములు ఆమెయొక్క స్వరూపమును తెలియజాలక వెనుకకు మరలి వచ్చుచున్నవి. ఆమె భర్తయొక్క దేహభాగమునుండి పుట్టినదా యన్నట్లు కానవచ్చెను (9). ఆమె తన మహిమచే ఈ జగత్తునంతనూ వ్యాపించి యున్నది. ఆ దేవి శరీరము కలది వలె కానవచ్చుట విచిత్రము (10). ఆమె ఈ జగత్తునంతనూ మాయచే సమ్మోహ పరచుచున్నది. ఆమె ఈశ్వరునినుండి పుట్టిననూ, వాస్తవములో పుట్టనే లేదు (11). ఆమె యొక్క సర్వోత్కృష్టస్వరూపము దేవతలకైననూ తెలియదు. జగత్తునకు, దేవతలకు ప్రభ్వియగు ఆమె భర్తయొక్క దేహమునుండి విడివడినది (12). సర్వలోకములకు అధిరాజ్ఞి , సర్వజ్ఞురాలు, సర్వవ్యాపిని, సూక్ష్మమగు స్వరూపము గలది, కారణ కార్యభావమునకు అతీతురాలు, సర్వోత్కృష్టురాలు, ఈ జగత్తునంతనూ తన కాంతిచే ప్రకాశింప జేయుచున్నది, మహాదేవి అగు ఆ పరమేశ్వరిని చూచి, హిరణ్యగర్భుడు, నమస్కరించి ప్రార్థించెను (13, 14).

బ్రహ్మోవాచ |

దేవి దేవేన సృష్టోఽహమాదౌ సర్వజగన్మయి | ప్రజాసర్గే నియుక్తశ్చ సృజామి సకలం జగత్ || 15

మనసా నిర్మితాస్సర్వే దేవి దేవాదయో మయా | న వృద్ధిముపగచ్ఛంతి సృజ్యమానాః పునః పునః || 16

మిథునప్రభవామేవ కృత్వా సృష్టిమతః పరమ్ | సంవర్ధయితుమిచ్ఛామి సర్వా ఏవ మమ ప్రజాః || 17

న నిర్గతం పురా త్వత్తో నారీణాం కులమవ్యయమ్ | తేన నారీకులం స్రష్టుం శక్తిర్మమ న విద్యతే || 18

సర్వాసామేవ శక్తీనాం త్వత్తః ఖలు సముద్భవః | తస్మాత్సర్వత్ర సర్వేషాం సర్వశక్తిప్రదాయినీమ్ || 19

త్వామేవ వరదాం మాయాం ప్రార్థయామి సురేశ్వరీమ్ | చరాచరవివృద్ధ్యర్థమం శేనైకేన సర్వగే || 20

దక్షస్య మమ పుత్రస్య పుత్రీ భవ భవార్దిని | ఏవం సా యాచితా దేవీ బ్రహ్మణా బ్రహ్మయోనినా || 21

శక్తిమేకాం భ్రువోర్మధ్యాత్ససర్జాత్మసమప్రభామ్ | తామహ ప్రహసన్ ప్రేక్ష్య దేవదేవవరో హరః || 22

బ్రహ్మణో తపసారాధ్య కురు తస్య యథేప్సితమ్ | తామాజ్ఞాం పరమేశస్య శిరసా ప్రతిగృహ్య సా || 23

బ్రహ్మణఓ వచనాద్దేవీ దక్షస్య దుహితా % భవత్ | దత్త్వైవమతులాం శక్తిం బ్రహ్మణ బ్రహ్మరూపిణీమ్ || 24

వివేశ దేహం దేవస్య దేవశ్చాంతరధీయత | తదా ప్రభృతి లోకే %స్మిన్ స్త్రియాం భోగః ప్రతిష్ఠితః || 25

ప్రజాసృష్టిశ్చ విప్రేంద్రా మైథునేన ప్రవర్తతే | బ్రహ్మాపి ప్రాప సానందం సంతోషం మునిపుంగవాః || 26

ఏతద్వస్సర్వమాఖ్యాతం దేవ్యాశ్శక్తిసముద్భవమ్ | పుణ్యవృద్ధికరం శ్రావ్యం భూతసర్గానుషంగతః || 27

య ఇదం కీర్తయేన్నిత్యం దేవ్యాశ్శక్తిసముద్భవమ్ | పుణ్యం సర్వమవాప్నోతి పుత్రాంశ్చ లభ##తే శుభాన్ || 28

ఇతి శ్రీ శివమహాపురాణ   వాయవీయసంహితాయాం పూర్వభాగే దేవీశక్త్యుద్భవో నామ షోడశో%ధ్యాయః(16).

బ్రహ్మ ఇట్లు పలికెను -

ఓ దేవీ! సర్వజగత్స్వరూపిణీ! సృష్ట్యాదియందు శివుడు నన్ను సృష్టించి, ప్రజలను సృష్టించే కార్యమునందు నియోగించినాడు. నేను సకలజగత్తును సృష్టించుచున్నాను (15). ఓ దేవీ! నేను దేవతలు మొదలగు వారిని మనస్సుచే సృష్టించినాను. నేను వారిని మరల మరల సృష్టించుచున్ననూ, వారు వృద్ధి చెందుట లేదు (16). ఈ పైన నేను స్త్రీ పురుషసంయోగజన్యమగు సృష్టిని మాత్రమే చేసి నా సంతానమునందరినీ చక్కగా అభివృద్ధి చేయవలెనని కాంక్షించుచున్నాను (17). పూర్వము నీ నుండి స్త్రీ సమూహము ఉదయించలేదు. కావున, స్త్రీ సమూహమును సృష్టించే శక్తి నాకు లేదు (18). శక్తులన్నియూ ఉద్భవించేది నీనుండియే గదా! కావున, సర్వకాలములలో సర్వులకు శక్తిని మరియు వరములను ఇచ్చే దేవేశ్వరివి మరియు మాయాస్వరూపిణివి అగు నిన్ను మాత్రమే నేను ప్రార్ధించుచున్నాను. ఓ సర్వవ్యాపినీ!సంసారనాశినీ! నీవు స్థావరజంగమాత్మకమగు సృష్టి వృద్ధిని పొందుట కొరకై ఒక అంశ##చే నా పుత్రుడగు దక్షునకు కుమార్తెవు కమ్ము.
పరబ్రహ్మనుండి పుట్టిన బ్రహ్మ ఈవిధముగా ప్రార్ధించగా, ఆ దేవి తన కనుబొమల మధ్యనుండి తనతో సమానమగు కాంతి గల ఒక శక్తిని సృష్టించెను. దేవదేవోత్తముడగు శివుడు ఆమెను చూచి నవ్వి ఆమెతో నిట్లనెను (19-22). నీవు తపస్సుచే బ్రహ్మను ఆరాధించి, ఆతని కోరికను మన్నించుము. పరమేశ్వరుని ఆ ఆజ్ఞను ఆమె తలదాల్చి (23), బ్రహ్మ కోరిన విధముగా దక్షుని కుమార్తె అయెను. మరియు, ఆమె వేదము రూపములోనున్న సాటిలేని శక్తిని బ్రహ్మకు ఇచ్చి (24), శివుని దేహమును ప్రవేశించెను. శివుడు కూడ అంతర్ధానమాయెను. ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! ఆ నాటినుండియు ఈ లోకములో స్త్రీల భోగము స్థిరపడి, స్త్రీ పురుషసంయోగముచే సంతానము కలుగుచుండెను. ఓ మహర్షులారా! బ్రహ్మ కూడ సంతోషమును, ఆనందమును పొందెను

(25, 26). ఈ విధముగా దేవినుండి శక్తి పుట్టిన తీరు అంతయు మీకు చెప్పబడినది. పుణ్యమును వర్ద్ధిల్లజేయు ఈ వృత్తాంతమును సృష్టిప్రకరణముతో బాటు వినవలెను (27). దేవినుండి శక్తి పుట్టిన ఈ వృత్తాంతమును ఎవడైతే నిత్యము కీర్తించునో, ఆతడు సకలపుణ్యమును, పుత్రులను మరియు శుభములను పొందును (28).

శ్రీ శివమహాపురాణములోని వాయవీయసంహితయందు పూర్వభాగములో దేవీశక్తి ఉద్భవించుటను వర్ణించే పదనారవ అధ్యాయము ముగిసినది (16).